# భార్యను

# దొంగిలించుట.



కథారత్నాకరగ్రంథమాల.

# సరస్వతీనికేతనగ్రంథములు.



(1) భక్తియోగము. తృతీయముద్రణము
బాబు అశ్వనీ కుమారదత్తుగారి బంగాళీగ్రంథ
మునకాంధ్రీకరణము. 260 పుటలు.
క్యాలికో బైండు. వెల రు. 1–8–0 లు.

(2) పూర్ణయోగము. అరవిందయోగి రచనల
ననుసరించి వ్రాసినది. వెల రు. 1–0–0

(3) జాతీయత. అరవింద యోగి రాజకీయ సాం
ఘిక యుపన్యాసముల కనువాదము. చక్కని
యెనిమిది వ్యాసములుగలవు. వెల రు. 0-5-0

(4) పార్థివ పదార్థ చికిత్సాచంద్రిక.
(హోమియోపాతిక్ టిష్యూ రెమిడీస్ 250 పుటల
గ్రంథము) కాలికో బైండు వెల రు 1–0–0

(5) ఆత్మరామాయణము (ద్వితీయముద్రణ
యందున్నది.)

మేనేజరు
సరస్వతీ నికేతనము.
బందరు.

కథారత్నాకరగ్రంథమాల

అనుబంధగ్రంథశా [redacted]

# భార్యను దొంగిలించుట



కథారత్నాకరగ్రంథమాలవారిచే

శారదా ముద్రశాలయందు ముద్రించి

ప్రకటింపబడియె.

1924

మూల్యము. 0-4-0

శారద, ముద్రాక్షరశాల మచిలీపట్టణము.

# భార్యను దొంగిలించుట



౧

ఆచుట్టుపట్లకు పెద్దగ్రామం భట్టిప్రోలు. ఆవూళ్ళో దాదాపు వెయ్యిబట్టలమగ్గాలు ఉన్నవి. నూరుకోమటిండ్లు గలవు. అందువలన కొంచెం వర్తకంగల గ్రామమని చెప్పవచ్చును. ఒక వందయిండ్ల బ్రాహ్మణులున్నారు. తురకలు, కాపులు, మొదలగువారు కూడా చాలామంది ఉన్నారు. మొత్తం ఆవూళ్ళో రెండువేల యిండ్లకు తక్కువలేవు. వూరంతా మాగాణి వ్యవసాయం. సగటున నది పాడిపంటవున్నవూరు. కాని చదువు సంధ్యలుమాత్రం శూన్యం. జూదం, పేకాట, పొట్లేళ్ళపందాలు, కోళ్లాటలు—చార్జీలు మొదలగు వానిలో చాలా పేరు మోగింది. అక్కడక్కడ పండుటాకులవంటి పండితులు అరుగులమీద గూర్చుని తాటాకు పుస్తకాలు తిరగేస్తూ ఉంటారు. పనసలు వల్లించేవారు కూడావున్నారు. కాని వారి దగ్గర పాఠంచెప్పకొనేవారు మాత్రం కలికానికైనా కానరారు. అయితే ఇదేంగొడవరా, అని వెక్కిరించె పైప్రమరీ గ్రాడ్యుయేట్లకు మాత్రం లోపములేదు.

ఆవూరి మధ్యనున్న దేవాలయాలలో, ఒకటి విష్ణాలయం. రెండవది శివాలయం. అవియంత ప్రాత వికావు. ఆదేవాలయాల మధ్యనుండు, వీధిగుండా, దక్షిణానికి పోతిమా, (లంజబిబ్బ, కనపడుతుంది. దానిమీద అప్పుడప్పుడు, బంగారు శాణాలు దొరి

కేవని చెప్తారు. అదియొక లంజయిల్లని, అదియంతయు పాడై పోయిందని, అందువలన దానికి 'లంజెదిబ్బ' అని పేరు వచ్చిందని చెప్పుకొంటారు. కాని కొంచెము దీర్ఘముగ యోచించిన అది బౌద్ధస్తూపమని తెలియకపోదు.

అక్కడనుండి యీశాన్యంగా కొంతదూరంపోతే, కొన్ని దేవాలయాలు కనుపడతవి. అందొకటి చాల గొప్ప శివాలయం. అది యతిపురాతనమని దానిని చూడగానే తెలుస్తుంది. అంత పెద్దదేవాలయాలు, తెలుగుదేశంలో ఒకటి రెండుగొట్లతప్ప కనపడవు. మండపాలు మొదలయినవి గాక ఒక్క దేవాలయం మాత్రం ఫర్లాంగు పొడుగు అరఫర్లాంగు వెడల్పు ఉన్నది. దాని శిఖరం మిన్ను ముట్టింది. ఆ వూరికి డెబ్భయినైదు మైళ్ల దూరంలో గాని కొండలు లేవు. గుండ్రాయి కావాలెనంటె అంత దూరం నుంచి రావలసిందె. కాని యెవ్వడో పుణ్యాత్ముడు— ఎన్ని లక్షలు ఖర్చులుపెట్టి దానిని కట్టించినాడో చెప్పజాలం. పాండ్యరాజులో చోళరాజులో కట్టించారని చెప్తారు. అది విశ్వసించవలసిన మాటే కాని, చరిత్రవిషయం, భట్టివిక్రమార్కుల పేరు యెరుగనివారు లేనే లేరుగదా! ఆ భట్టిపేరున కట్టిన వూరు కాబట్టి 'భట్టిప్రోలు' అను పేరు వచ్చింది.

ఆవూళ్లో ఒక గొప్ప ధనికుడున్నాడు. ఆయనపేరు సీతారామశాస్త్రి. అంతగా యేశాస్త్రంలోను, ఆయనకు పరిచయం లేదు. కాని నాలుగు సంస్కృతం ముక్కలు చదువుకున్నాడు. మంచి శిష్టు. దానధర్మాలని, పండుగలని, పర్వాలని, బ్రాహ్మడని

# భార్యను దొంగిలించుట.

గట్టని కొంచెం ఆయన మనస్సులో ఉన్నది. అందువలన నలుగురిలోను 'జైనురా', అని యనిపించుకుంటూ తిరుగుతాడు.

ఆయన రెండో కొడుకు పేరు నారాయణరావు. అతడు పట్టపరీక్ష యిచ్చి యింటికి వచ్చి పది దినాలైంది. పాతికేండ్లలోపు వాడు. కొంచెం చామనచాయ—పొడుగు—సన్నని వాడు. కాని మొత్తంమీద చక్కనివాడనే యనవచ్చును.

నారాయణరావు మీద తండ్రికి మిక్కిలి కోపం. ఎందుకంటే మొదటిది బ్రహ్మసమాజంలోకి వెళ్ళుచున్నాడని. రెండవది పెండ్లాము వేలచెని.

ఎవ్వరైనా నారాయణరావును, కారణ మడిగితే 'ప్రేమించి నేను పెండ్లాడలేదు. అందువలన ఆ పిల్ల నాకు భార్య కాదు. చెల్లెలు.' అని చెప్తాడు. ఎందులకు పెండ్లాడినావయ్యా, అని అంటే దానికి సమాధానం యిట్లా చెప్తాడు. 'అప్పటికి నాకు జ్ఞానం లేదు. మావాండ్లు పెండ్లి పీటల మీద కూర్చోమన్నారు. నేను కూర్చున్నాను.' 'ఏమయిందో అయిందిగాని యిప్పుడైనా పిల్లగతి యేమి' అని అంటె, 'మేమిద్దరము బ్రాహ్మసమాజంలో కలుస్తాము. అప్పుడు మా వివాహబంధనం పోతుంది. కాబట్టి ఆమె తన కిష్టమువచ్చినవానిని పెండ్లాడుతుంది. నాయిష్టమువచ్చిన దానిని నేను పెండ్లాడుతాను' అని చెప్తాడు. ఆమాటలు పల్లెటూరివారికి కొంచెము చిత్రంగా ఉండటంలో ఆశ్చర్యం యేమున్నది!

## ౨

వివాహము కాగానే నారాయణరావు, చదువుకోడానికి రాజమండ్రి వెళ్ళాడు. అక్కడ వానికి దొరకిన మంచిస్నేహితుడు భాస్కరరావు. అతడు బ్రహ్మసమాజంలో చాల ముఖ్యుడు. పట్టుదలగలవాడు. వీరిద్దరికి స్నేహం బాగా కలిసింది. కమల, తనను మోహించినదని, నారాయణరావుకు బాగా నమ్మకం కుదిరింది. 'కమల, అంటే భాస్కరరావుకు వేలు విడచిన మేనత్త కూతురు. 'కమల, నారాయణరావును ప్రేమించిందని భాస్కరరావుకు నమ్మకం కుదిరింది. కాని నారాయణరావు మొదట చిత్తచాంచల్యమునకు, చాల సిగ్గుపడ్డాడు. అనుతప్త హృదయుడైనాడు.

కాని భాస్కరరావు నారాయణా "ప్రేమంటే నీకు బాగా తెలియునురా? అందువలన పొరబడుచున్నావు? అది యీశ్వరశక్తి వికాసము. దానినెప్పుడు పాపము స్పర్శింపదు,, అని యేమేమో చెప్పేటప్పటికి, నారాయణరావు మనస్సు కుదుటబడ్డది.

మీదు మిక్కిలి భాస్కరరావు నమ్మకమేమంటే "ప్రేమతో గూడుకొన నటువంటిన్ని, ఊయింగు లేనటువంటిన్ని వివాహము వివాహమే కాదు. నారాయణరావు రామమ్మను ప్రేమించి వివాహమాడలేదు. అందువలన నది వివాహము కాదు. అది వట్టి దురాచారం. కాబట్టి రామమ్మ నారాయణరావునకు భార్య కాదు. చెల్లెలు."

ఈయద్భుత సిద్ధాంతం నారాయణరావు తలకు బాగా యెక్కింది. కమలకు నారాయణరావుకు వివాహం అయిన

యితే ఐడియల్ మ్యారేజి, అగునని భాస్కరరావు సంతోషానికి మేరలేదు. కాని యిదివరకయిన పెండ్లి తెగి పోయినగాని యీ పెండ్లి జరగడానికి వీలులేదు. అందువలన కమలమీద ప్రేమను వ్యక్తీకరించుటకు గూడ నారాయణరావున, కధికారంలేదు. భాస్కరరావు సాధరణంగా చెప్పేది యేమంటె "ప్రాణం ప్రాణం—ఆత్మ ఆత్మ ఒకటైపోవడమే ప్రేమయొక్క చరమావస్థ కాబట్టి వివాహం కాకపోతేనేమి?,,

మిట్టమధ్యాహ్నము, జ్యేష్ఠమాసము. మామిడి కాయలను పక్వానికి తీసుకురావడానికి యెండ పేల్చిపోతున్నది. కచేరి సావిట్లో దక్షిణపుగదిలో నారాయణరావు, మడత కుర్చీమీద పడుకున్నాడు. ఆగది యితనిది. అందులో సామాను ఆటె లేదు. కాని పడుకునే చిన్నమంచం—బీరువా—రెండుమూడు కుర్చీలు—టేబిలు—టేబిలుమీద— అద్దము— దువ్వెన— మంగలకత్తి, సామాను చిన్నపెట్టె ఒక ట్రంకు—గోడకు కొన్ని మాటోలు—నాలుగైదు స్నేహితుల ఫొటోగ్రాపులు, పెద్ద గడియారం, ఏడెనిమిది రకాల బూట్సులు, తుబ్రషు, బూటు బ్రష్, హెయిరు బ్రష్, కోటుబ్రిష్, గోడకొక యేకతారా సొరకాయ బుర్ర— ఇవిమాత్రం యున్నవి. ఉదయం సాయంత్రం యేకతార మీటుచు బ్రహ్మగీతములు పాడుకొనడము నారాయణరావుకు ఆచారం.

భాస్కరరావు దగ్గరనుండి, అప్పుడే వచ్చిన ఉత్తరం చదువుకుంటూ, అందులో కమలపేరు వచ్చిన ప్రతిచోటను, ముద్దుపెట్టుకుంటూ ఉత్తరం చదువుకొన్నాడు. తర్వాత ఉత్తరం

చేతితో బట్టుకొని కండ్లు మూసికొని యోచిస్తూ కుర్చీమీద పడుకుని ఉండగా గడియారం గంటలు టింగ్, టింగ్ అని రెండు కొట్టింది.

నారాయణరావు కండ్లు తెరచి, చేతిలోని ఉత్తరం జాగ్రత్తగా డ్రాయరులో బెట్టి, ఒక చిన్న కాగితం దీసికొని టేబిలు ముందు గూర్చుండి, యోచించి యోచించి, చివరకిట్లా వ్రాశాడు.

“ఇవాళ రాత్రి. పండ్రెండు గంటలు కొట్టిన తర్వాత నా గదిలోనికి ఒకమారు రా”

ఆ కాగితమును నాలుగైదు మడతలు పెట్టి, దానికి ఇంకొక కాగితం చుట్టి గోందు రాచి అతికించి దానిని పైఘాము జేబులో బెట్టుకొని తనగది వదలి 20 గజాల దూరంలోనున్న పదహాసుం బాలిక, మందువా ప్రాంతంలోనికి వెళ్ళాడు— మందువా సావిట్లో యెవ్వరును లేరు. మొదటిగదిలో తొంగిచూచే టప్పటికి, ఒక చేతితో చిన్నపిల్ల పడుకున్న తొట్టి ఊగించుచు వదినెగారు పక్కయింటి స్నేహితురాండ్రతో గప్పాలాడుచున్నది. నెమ్మదిగా వారికి కనబడకుండా తప్పించుకొని రెండోగదిలోకి పోయినాడు. అక్కడ గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్న తల్లినిచూచి, పడకటింటి ప్రక్కగదిలోకి వెళ్ళాడు. అన్నకొడుకు రాముడు మైలగుడ్డలతో మడికందిపప్పు దొంగిలించి తినుచు, పినతండ్రినిచూచి యులికిపడి పకపక నవ్వాడు. కాని నారాయణరావు వాడి చేష్టలను గమ

# భార్యను దొంగిలించుట.

నింపక పడమటింటి గుమ్మము దగ్గరకు వచ్చినాడు. కాని యా యింటిలో పెద్ద దేవతార్చన ఉన్నది. విగ్రహములమీదనుండే ద్వేషము వలన నారాయణరావు యింటిలోనికేగి ఇప్పటికి నాలుగైదేండ్లు యింది. అందువలన నా యింటిలోకి పోదామా? వద్దా? అని రెండు మూడు నిముషాలు యోచించి, చివరకు దక్షిణపు ప్రక్క వాకిలిద్వార బంధములు బట్టుకొని తొంగిచూచేటప్పటికి రామమ్మ చిరుచాప మీద కూర్చుండి, తదేకనిష్ఠగా దీపారాధన వత్తులు చేయుచు, 'లక్ష్మణస్వామి నవ్వును, నెమ్మదిగా పాడుచుండెను. ఆమె పెదవులు తాంబూలం వేసికొన్నట్లు పగడాలవలె ప్రకాశింపుచుండెను. మోమున కొంచెం చమటపట్టి ముత్యాలు అలంకరించినట్లుండెను. ఆ ఫాలతలాన బాలసూర్యుని వంటి కుంకుమ బొట్టు—చెంపకు చారడు కన్నులు—పట్టెడు వేలుముడి—దానిమీద నాలుగైదు, బంతి పూలు ముడుచుకున్నది. చెవులకు తెల్లరాళ్ళ దుద్దులు—ముక్కుకు ఒంటిరాతి యెర్రని పుడక—తంగేడుపూచినట్లు మెడనిండా నగలు— ఆమె స్వభావ సిద్ధముగు కోమల సౌందర్యమునకు దోడ్పడుచుండెను. ఆమెను చూడగానే శిష్టాచార సంపత్తిగల స్త్రీయని చెప్పక తప్పదు. నారాయణరావు ఒక్క నిమిషం విస్మయ చిత్తంతోటి ఆమెను చూచాడు. కాని కన్ను వాల్చలేదు. వివాహం మనుగుడుపు అయినతర్వాత, రామమ్మను కన్నెత్తి చూడడానికి యిదే ప్రథమం.

పడమటింటి దొడ్లో, మామిడికాయ గాలికి రాలి క్రింద పడ్డది. ఆచప్పుడుకు రామమ్మ తలయెత్తి చూచేటప్పటికి, నారాయణరావు కనపడ్డాడు. ఉలికిపడి ఆమె లేచి

కిటికీపక్కకు వొదిగింది. అప్పుడామె కొంగు తాళంచెవులు, కాళ్ళ అందెలు కడియాలు, మెళ్లో గజ్జెలపట్టెడ గలగలమన్నవి.

నారాయణరావు నెమ్మదిగా లోపలకివెళ్లి జేబులో ఉత్తరం దీసి, విసురుబుచ్చుకొని, రామమ్మవంక పారేసి, గబగబ బైటికి వచ్చాడు.

నారాయణరావు వెళ్లినతర్వాత రామమ్మ ఆయుత్తరం దీసికొని, పడమటింటి తలుపులు గొళ్ళాలుబెట్టి, తన గదిలోకి వెళ్లింది. తలుపు వేసికొన్నది. తర్వాత కిటికీమీద కూర్చుని యుత్తరము విప్పి చదువుకొన్నది. తలయెత్తి చూచింది. కాయలతో నేలకంటుచున్న మామిడిగున్నలో నుండి కోకిలపాట ఆమె హృదయ తంతువుల శృతిలో లీనమైంది. తిరిగి వుత్తరంవంక చూచి వులికపడి లేచి గదిగుమ్మం దగ్గరకువెళ్ళి గొళ్ళెం గట్టిగాపెట్టి తిరిగి వచ్చి కూర్చున్నది. వుత్తరం చదువుకొని తల యెత్తేటప్పటికి, మామిడికాయలకొట్టు రామచిలకల జంట ఆమెకు కనపడ్డది. తిరిగి ఆకాగితము చదువుచున్నది. తర్వాత అవుత్తరం కొంగున ముడివేసి దానిని బొడ్డున దోపుకొని, నెమ్మదిగా తలుపుదీసికొని పడమటింటిలోకి బోయి దేవతార్చనలోని లక్ష్మీనారాయణ విగ్రహానికి సాష్టాంగ దండప్రణామంచేసి, తిరిగి అచ్చట నుండి వచ్చి తన గదిలోచేరి, తలుపు గట్టిగా గొళ్ళెము పెట్టి కొంగుముడి విప్పి కాగితం చదువుకుంటూ కూర్చున్నది. రెండుముక్కలు? ఎంతసేపు చదివిందంటారేమో? గంటసేపు చదివింది. కాని తరగ లేదు.

ఈమె పెండ్లి పండ్రెండవ యేట, రేపల్లెలో జరిగింది. పెండ్లియైన పదినెలల కల్లా ఆమె వ్యక్తురాలైనది. ఆమె పెద్ద మనిషియయిన తర్వాత నారాయణరావుకు, నూతన సిద్ధాంత మబ్బినది. అందుచేత నిషేకం జరుగలేదు. నారాయణరావుకు ఎందరో చెప్పి చూచారు. కాని లాభము లేకపోయింది. తలిదండ్రులు చెప్పి చెప్పి విసిగి రెండేళ్ళ క్రిందట కోడలును యింటికి దీసికొని వచ్చారు. ఇప్పటికి ఆమె వ్యక్తురాలై నాలుగేండ్లు. గత వత్సరము యెండాకాలము సెలవులలో కార్యం చేస్తామని యెంతో ప్రయత్నించారు. కాని యేమిలాభం? ఎవరుచెప్పినా వినలేదు. మీదుమిక్కిలి 'ఫూల్సు మీకు తెలియదు,' అని 'సోలు, హ్యూమానిటీ, గాడ్, లవ్, మొదలగు పది యింగ్లీషు మాటలు గుప్పించెడువాడు. చదువుకున్నవాండ్లు యేమిటిరా యీసిద్ధాంతం అని అనేవాళ్ళు. సామాన్యులు ఇది క్రొత్తమతంరా అని యేమో గొణుక్కొనేవాళ్ళు. కాని ముఖ్యమైన మాట వినలేదు. సీతారామశాస్త్రి "మావాడికి ముప్పైరెండు గుణాలలో రెండు మాత్రం తక్కువ అవియేమి టంటే 'వాడికి తోచదు, ఇంకొకడు చెప్పితే వినడు.'" అనివారితో వీరితో చెప్పి విచారపడేవాడు. ఈదఫా వచ్చినప్పటినుండి, మావాడితో 'మీరు చెప్పండి నాయనా మీరు చెప్పండి నాయనా!, అని నారాయణరావు తల్లి యెంతమందినో బ్రతిమాలింది. కాని యీమెవమాట చెవినిపెట్టేవారెవరు? వాడిది కంకపట్టు. ఎవడు చెప్పినా వినడు. సీతారామశాస్త్రి పెద్ద కొడుకు, అన్నప్పుడు తల్లి యేడ్చేది. రామమ్మను చూచినవాళ్లు విచారపడేవారు.

ఇక రామమ్మను గూర్చి చెప్పేదేమిటి? తోటివాండ్ల అచ్చట్లు ముచ్చట్లు, పిల్లలు, భర్తలతోటి సరస సల్లాపాలు, చూచి

నప్పుడు, తలంపునకు వచ్చినప్పుడు, 'పూర్వజన్మములో ఏదంపతు లనో విడదీసినాను అందువల్ల నాకీగతి పట్టింది, అని రాత్రింబ వళ్ళు యేడ్చి యేడ్చి లోలోన గుండె వంటే చిత్రంగాదు.

రామమ్మ ఉత్తరము చదువుకుంటూ మనోకల్పిత రాజ్య మందు యేమేమో కల్పనలు చేసుకుంటూ ఉండగా, ఆమె గదితలుపు గబగబమని యెవరో రెండుమూడు వాట్లు గుద్దారు. ఉలికిపడి రామమ్మ లేచి గడప దగ్గరకు వెళ్ళి తలుపుతీయక తిరిగివచ్చి యుత్త రము మడచి బొట్టుపెట్టి క్రిందబెట్టి గంభీరముగ తాఁగి వెళ్ళి తలుపు తెరచి చూచేటప్పటికి వారదలు మహాలక్ష్మి.

ఆమె బాల వితంతువు. అధీనంతప్పి యై దేండ్లయినది. రామమ్మకంటె మహాలక్ష్మి మూడేండ్లు పెద్దది. కాని వీరిద్దరికి మిక్కిలి స్నేహము. ఇద్దరు కష్ట సుఖములు చెప్పకొనుచు, పాట, పద్యం, నోములు, వ్రతాలతో కాలము వెళ్లబుచ్చు కుంటూ ఉన్నారు.

ఇవాళ రామమ్మ వైఖరీ మారింది. చాల గంభీరముగ నుండడానికి ప్రయత్నం చేస్తున్నది. కాని మనస్సులో నున్నది మోముమీదను, కనుచూపులలోను, మాటల తడబాటులోను వెల్ల డగుతూనే ఉన్నది. కాని దానిని వర్ణించడానికి వీలులేదు. మహా లక్ష్మి రామమ్మను జూచినంతనే ఆమెలో మార్పును కనిపెట్టి 'ఏమమ్మాయి? ఇవాళ యేమో ఉందే!అన్నది.

రామమ్మ:— (గంభీర స్వరముతో నెమ్మదిగా) ఏమున్నది. ఏమీ లేదు. (చిరునవ్వు పొరివచ్చి బయుట బడుచుండెను.)

మహాలక్ష్మి:— (మిక్కిలి సందేహముతోడ నవ్వుచు రామమ్మను కౌగిలించుకొని) ఏమిటో నాకు చెప్పవూ ? వదినా! నాకు చెప్పవూ ?

రామమ్మ:— చెప్పతాను.

మహాలక్ష్మి:— ఎప్పుడు చెపుతావు?

రామమ్మ:— రాత్రికి.

మహాలక్ష్మి:— కాదు ఇప్పుడే చెప్పు వదినా!

రామమ్మ చెప్పేటట్టు లేదు. మహాలక్ష్మి ఆమెను విడిచేటట్టూ లేదు. ఇట్లొక పదినిముషములయిన తర్వాత రామమ్మ జరిగినసంగతి చెప్పింది.

ఈవిషయం వినగానె మహాలక్ష్మి క్షణకాలము గంభీరముగ నుండి చిరునవ్వు నవ్వసాగేటప్పటికి రామమ్మ యిట్లన్నది. "నవ్వుతావెందు కమ్మా?"

మహాలక్ష్మి:— నీపెనిమిటి చేష్టలుజూచి. నీవు కనిపెట్టావో లేదో గాని, యీవచ్చిన పదిదినాలనుండి నీవెంట తద్దాదుమనె ఉన్నాడు. అబద్ధమంటావేమో? నేను పెద్ద వదినతో చెప్పానో లేదో కనుక్కో?

రామమ్మ:- ఏమని?

మహాలక్ష్మి:— ఏమి చెప్పానంటావా? (ఈతడివేషం చూస్తే పెండ్లాముకోసం యిటునటు తిరుగుచున్నట్టున్నది. కాబట్టి నీవొకమారు చెప్పరాదా? ,అని నేనన్నాను. ( పనిపాపా,

ఇష్టముంటే పెండ్యాము పిలువరాదా? మాట్లాడరాదా? వారు వీరుచెప్పేదేమిటి? పెండ్యాముతో మాట్లాడవద్దని యెవరయినా అన్నారా? అడ్డగించారా? అని వదినెఅన్నది. అప్పుడు నేను ,,అదికాదు'' నాలుగేండ్లనుండి మాట్లాడని వాడు, ఇవాళమాట్లాడడానికి సిగ్గుపడడా? కార్యం కాలేదుగదా! అని అన్నాను. ఇది వరకు పందమాట్లు చెప్పాను. నామాట వినలేదు. మళ్లీచెప్పడానికి నాకు యిష్టంగా లేదు. ఎవరి కర్మం వారనుభవిస్తారు రామమ్మను చూస్తే కడుపు తరుక్కుని పోతుంది. అయినా రెండునెలలింకా వుంటాండుగా? సమయంచూచి నాల్గు చీవాట్లు పెడతాము, అన్నది.

రామమ్మ:— వదినా! నేనుపోను.

మహాలక్ష్మి:— ఎందుకుపోవు ?

రామమ్మ:— నన్నవమాన పరచును.

మహాలక్ష్మి:— (చేయి త్రిప్పుచు) మంచిదానవే. బాగుంది. బాగు పడే యోచనేనా యిది ? అవమానం రేమిటి? చాలులే! (గంటలు లెక్కపెట్టు చున్నది.)

రామమ్మ:— నీ యెగతాళి కేమిగాని, భయము వేయుచున్నదమ్మా?

మహాలక్ష్మి:— భయంలేదు. నీ మొఖంలేదు. మొదటిరోజున కొంచెము భయమే. కాని రెండవరోజు వుండదు. పది రోజులలో నాపసానివి కావు ? (అని పకపక నవ్వింది.)

రామమ్మ:— అట్లాగయితే నేను పోనేపోను. ఒకరోజు వెళ్లితే ప్రతిదినం వెళ్లవలె.

మహాలక్ష్మి:— ఒకదినంతో సిగ్గు యెగిరిపోతుంది. ఆపైననాలో మాట్లాడటానికికూడా సిగ్గు తీరుతుంది ?

రామమ్మ:— వద్దక్కమ్మా! భయం వేస్తుంది.

మహాలక్ష్మి:— మాట్లాడక భయంలేదు గియంలేదు

గంటలు లెక్క పెట్టు మహాలక్ష్మి!, అని తల్లి కేకవేయగా గుమ్మములోనికి బోయెను. ప్రాయంత్రమైనది ఎవరు మడికట్టు కునేది, అని యడుగ చిన్నవదినో నేనో మడికట్టుకుంటా, మని చెప్పి గదిలోనికివచ్చి, వదినా! నీవు మడికట్టుకో, అనెను

రామమ్మ:— కాదు నీవు మడికట్టుకో.

మహాలక్ష్మి:— ( చేయిబట్టుకొని, ) కాదు నీవు మడికట్టుకో.

నీయిష్టము వచ్చిన రుచులతో వంటచేయవచ్చునని నవ్వుచు పడమటింటిదాక వెళ్ళి వదినా? కాదు నేనే మడికట్టు కుంటాను. మల్లెపూవులతో తలముడుచుకో,మని మహాలక్ష్మి వంట చేయుటకు వెళ్ళింది.

“వదినా! వదినా! నిద్రపోవుచున్నావమ్మా?” అని రాత్రి పండ్రెండు గంటలప్పుడు మహాలక్ష్మమ్మ రామమ్మను పిలిచింది. రామమ్మలేచి కూర్చుని పన్నెండు గంటలైందా?, అని అడిగింది.

మ:— పండ్రెండైందంటావా? (గడియారము చూచివచ్చి) పండ్రెండు దాటినట్లున్నది.

రా:— నీవు నిద్దర పోయినట్టున్నది పూర్తిగా.

మ:— నిద్దురాలేదు—భద్దరాలేదు. కానిలేలే. ఏమిటియోచిస్తావు?

అని మహాలక్ష్మి దీపం ముట్టించినది. కొనడి పెట్టెలో నుండి, శాలం పట్టుచీర దీని కట్టుకోమని యివ్వబోతే —

రామమ్మ:— వద్దమ్మా!. కట్టుకున్నబట్ట బాగానేవున్నది.

మహాలక్ష్మి:— ఊరుకో పిచ్చిదానా ... ... ఈమానినబట్ట కట్టుకొని పోతావా?

అని రామమ్మను పక్కమీదనుండి లాగి శాలం పట్టుచీర కట్టుకోమని మీదవేసింది. రామమ్మ కొత్తచీర కట్టుకోక తప్పిందికాదు. "మంచిదానవే" అనుచు నవ్వుచు "నన్ను పిచ్చి దాన్ని చేస్తూన్నావు" అని చీరకట్టుకొన్నది. చీరకట్టుకోగా వెనకా ముందు తిరిగి చూచి "బాగుంది. ఈరవిక తొడుక్కో" అని గొండినుండి తీసియిచ్చింది. ఆ రవిక తెల్లరవిక. ఈరవికను నల్లని ఎర్రని పూసలతో స్వయముగ కుట్టినదిరామమ్మ. దానినిచూచి నవ్వుచు తొడుక్కొన్నది.

మహాలక్ష్మి:— బేష్ బాగున్నావు. వెళ్ళు యిప్పుడు। వెళ్ళు (అని నవ్వింది)

మొత్తంమీద వీరు గదిలోనుండి బైటకు వచ్చేటప్పటికి గం టపట్టింది. ఇద్దరూ బయలుదేరి నాలుగడుగులు వేసేటప్పటికి రామమ్మ కాళ్ల అందెలు కడియాలు ఘల్లు మన్నవి. ఆ శబ్దమునకు మహాలక్ష్మి యులికిపడి 'బాగుంది చప్పుడు గాకుండా నడువు ప్రస్తుతం వదినెగారికి వళ్ళు తెలియడం లేదు, అని అన్నది.

ఇద్దరు నెమ్మదిగా బయలుదేరి నారాయణరావు గదిదొడ్డి లోనికి బోయినారు. అక్కడ రామమ్మ చెవిలో మహాలక్ష్మి యిట్లాచెప్పింది. 'తలుపు దెరచి యుంటాగాని నెమ్మదిగారా. తొందరపడక,, అని వెనుకకు వెళ్ళింది.

రామమ్మ నెమ్మదిగా మెల్లెక్కి కిటికీలనుండి గదిలో చూచింది. లోపల దీపము వెలుగుచున్నది. అక్కడనుంచి తలుపు దగ్గరకు వచ్చింది. కాని వెళ్లడానికి భయం. గుండెలు దడదడ

లాడుచుండ యెట్లాగయితేనేమి లోపల కాలుపెట్టి పోయింది. కాని త్వరగా పాదంపడదు. చివరకు అతిధైర్యముతో వోరవాకిలి తెరచి లోపలకు వెళ్ళి గోడనానుకొని నిలుచున్నది. నిద్రబో తున్న నారాయణరావును చూచింది. ఒక్క నిమిషం తదేకనిష్ఠ గాచూచి వెనక్కువచ్చి తలుపువేసి గొళ్ళెముపెట్టి, గొళ్లెముగట్టిగా వేసినానో లేదో నని తిరిగి మూచి వచ్చి దీపమార్పింది దీపమార్పే టప్పటికి యిల్లంతా వెన్నెల. భర్తమోము వెన్నెట్లో ప్రకాశింపు చుండ నిలుచుండి రామమ్మ యారూపమును రెప్పవాల్పక చూచుచు "ఇతడే నాభర్త. చాలచక్కనివాడు" అనుకొన్నది. అప్రయ త్నంగా ఆమెతల కొంచం కదిలింది. అప్పుడామెకు కొంచెము గర్వం వచ్చిందంటె వింతకాదు! రెండుమూడు నిముషాలయిన తర్వాత, 'నుంచివారు. రమ్మని చెప్పిపడుకొని నిద్రపోతున్నారు' అనుకున్నది.

తర్వాత ఏమిచేసేది యని యోచించి, చివరకు "నాకింతవరకు పాదసేవదొరకలేదు. ఈసుయోగాన్ని యెందుకు వదలుకోవలెను." అనుకొని భర్తపాదములకడ గూర్చునిమెల్లదిగా కాళ్ళు పట్టసాగింది. షుమారు రాత్రి రెండు గంటలు. పండు వెన్నెల. మల్లె పాదరింటి నుండి దక్షిణపు గాలి కొంచెము తీవ్రముగా వీచుచున్నది. అప్పుడు ఒంటి గంటదాకా మేలుకొన్న నారాయణరావు హాయిగా గుఱ్ఱుకొట్టి నిద్దరబోతున్నాడు. ఒకటి రెండు గడియలయిన తరువాత రామమ్మ కాళ్లదగ్గర పడుకున్నది.

టింగుటింగుమని గడియారం మూడు కొట్టేటప్పటికి నారా యణరావుకు మెళుకువ వచ్చింది. మెళకువ వచ్చిన ప్రథమ ముహూ ర్తంలో తానెవరికోసమో నిరీక్షిస్తున్నానను కొన్నాడు. క్రమంగా

రామమ్మను రమ్మన్నమాట జ్ఞప్తికి వచ్చింది. మేలుకొన్నంతసేపు ఆమెకోసం యెదురుచూస్తున్నాడు. కాని యెప్పుడు ఒంటిగంట కావచ్చిందో రామమ్మ రాదనుకొని నిద్దరబోయినాడు. అసంగతి భావింపుచు పక్కకు దొర్లేటప్పటికి కాలు రామమ్మకు తగిలింది. శరీరస్పర్శవలన నారాయణరావు ఉలికిపడి కూర్చున్నాడు. చూచాడు. రామమ్మ నిదురబోవుచున్నది. అప్పటికి వెన్నెల కొంచెము తగ్గింది. కాని రామమ్మ మోముమీద కొంతపడినది. ఆవెలుతురులో నిద్రబోతున్న రూపలావణ్య యౌవనవతియగు భార్యను చూచాడు. సౌందర్యవతియని నారాయణరావు మనమునకు దట్టింది. ఆమె యధరములు కొంచెము కదులుచుండెను. అందు వలన నామె కలలో నున్నదో దొంగనిద్దరబోవుచున్నదో ఎవ్వరు చెప్పగలరు?

భార్యకేసి చూచినకొలది నారాయణరావు యిట్లా అనుకొన్నాడు. 'చాల సౌందర్యవతి. కమలకంటె గూడ రూపసి.' ఇట్లు అనుకొనుచు రెండు నిముసాలు చూచి వెంటనే ముఖము త్రిప్పుకొని పక్కమీదనుండి చివ్వునలేచి కండ్లు తుడుచుకొని నెమ్మదిగా "హే ప్రభో! నాకు బలమొసంగుము; ప్రభో! నేను పాపిని. నాయాత్మకు పారిశుద్ధ్య మొసంగుము" అని ప్రార్థించి వెన్నెలయే చిత్తచాంచల్యమునకు కారణమని తలచి, దీపము ముట్టించి రామమ్మకాలిమీద చెయివేసి నెమ్మదిగా 'రామమ్మా' అని కొట్టాడు.

రామమ్మలేచి సంకుచిత చిత్తయై వెంటనే మంచందిగి బట్ట సవరించుకొని తలవంచుకొనిప్రక్కగోడ కానుకొనినిలుచున్నది.

నారాయణరావు:— 'రామమ్మా!'

భార్యను పేరుపెట్టి అమ్మా, అని పిలువరు. అందువలన రామమ్మకాపిలుపు వినగానే చిత్రంగా ఉన్నది. కాని మాట్లాడలేను తలయెత్తి చూచింది.

నా:—నిన్నెందుకు పిలిచినానో తెలుసునా?

రా:—తెలియదు

నా:—అయితే చెప్పుతా విను. నాతో రాజమండ్రికి రావలె. వస్తావా?

రా:—(జబాబులేదు)

నా:—వస్తావా, రావా? చెప్పు.

రా—(మృదుమధుర స్వరమున) మీరెక్కడకు దీసికొని పోతే అక్కడకు వస్తాను.

నా:—అమ్మకు నాయనకు తెలియకుండా రా. వస్తావా?

రా:—(మాట్లాడలేదు)

నా:—చెప్పు, నీయభిప్రాయం చెప్పు వస్తావా? రావా? సిగ్గుపడకు.

రా;—వారికి తెలిస్తే నేమి? వారితో చెప్పరాదూ?

నా:—నిన్ను దీసికొని వెళ్లడం అందరకు యిష్టమే కాని నాన్నగారికి యిష్టంలేదు. (ఆయన యేమన్నాడంటె వీడు చపలచిత్తుడు. అందువలన వాడికెప్పుడేమి తోస్తే అట్లా చేస్తాడు ఇంటికోడలకు బూట్సులు చొక్కాలు తొడిగి బ్రహ్మసమాజంలోనికి దీసికొని పోతాడు. ఆమాటలు వినలేను,, అని అన్నాడు.

రామమ్మ:—బ్రహ్మసమాజం మాటనిజమే నా?

నారా:—మనమిద్దరము బ్రహ్మధర్మం పుచ్చుకుందాము.

రామమ్మ భయపడ్డది. భర్త పన్నాగం బాగా తెలియదు. అప్పుడు నెమ్మదిగా ఇట్లన్నది. "నేను దేవుళ్లను, దేవతలను, నమ్ముతాను. నేనెట్లు బ్రహ్మజ్ఞానినయ్యేది;"

నారాయణరావు, గంభీరముగా ఇట్లన్నాడు "ఆ మూఢ నమ్మకాలు నీవు విడువుము. అది అంతా పట్టిభ్రమ. నేనొక్క ఈశ్వరుని యారాధించడం లేదా,,

నారా:—మీరు చదువుకున్నారు. పరీక్షలిచ్చారు. కాని నాకేం తెలుసును?

నారా:—నీకు చదువు చెప్పుతాను. రాజమండ్రి వెళ్లిన తర్వాత యేర్పాటుచేస్తాను. గరల్సు స్కూలులో చేరుదువుకాని.

రామమ్మ:—(తలత్రిప్పుచు) నేను చదువుకుంటె మీదగ్గరనే చదువుకుంటాను. కాని నేను పసిపిల్లలాగ బళ్ళోకి పోను. ఇన్నేళ్ళొచ్చి.

నారాయణరావు క్షణకాలమూరకుండి, నీవు భ్రమ పడుతున్నావు. మనమిద్దరము ఒకచోట నుండడానికే వల్లకాదు.

రామమ్మ:— (ఆశ్చర్యముతో) అయితే నేనెక్కడ ఉండేది?

నారా:— ఆ స్కూలుదగ్గర చిన్న గదులున్నవి. దానిలో ఉండడం. స్కూల్లో చదువు కోనడం.

రామమ్మ:— (గట్టిగా) అయితే నేను రాను.

నారా:—"ఎక్కడరోగమో అక్కడ మందువేయడానికి వీలు లేదు. కావున వివరంగా చెప్పితేనేగాని సంగతి తేలదు" అనుకొని యిట్లన్నాడు. ఇన్నాళ్లనుండి నేను నీకు కన బడకుండా యుండడానికి కారణం తెలుసునా?"

రామమ్మ:— విన్నాను. కాని బాగా తెలియదు.

నారా:—అయితే తెలిసేటట్లు చెప్పతాను విను. మొదటికారణం మన వివాహము ప్రేమతో కూడుకొన్నది కాదు. రెండవది గణపతిపూజ, మంత్రాలు తంత్రాలతో జరిగింది. ఈ రెండు కారణాలవల్లను మన వివాహము సరియగు వివాహముకాదు కాబట్టి నీవు నాకు భార్యవు గావు. చెల్లెలు వంటిదానవు. గ్రహించినావా?

రామమ్మ:—కాదు.

నారా;—అయితే స్పష్టంగా ఇంకొక మాట చెప్పతా విను. నేను నిన్ను ప్రేమించడం లేదు.

రామమ్మ;—ఆవిషయం తెలుస్తునే యున్నది.

నారా:—ఇంకొక స్త్రీని ప్రేమించితిని.

రామమ్మ;—అయితే నేనెందుకు! రాజమహేంద్రవరానికి!

నారా;—ప్రేమించకుండా నిన్ను పెండ్లాడినాను అందువలన అన్యాయం కలిగింది. కాని యిక నీజీవితాన్ని నిష్ఫలం చేసి, నిన్నొక సాగరంలో పడవేయను. మనమిద్దరము బ్రహ్మధర్మంలో చేరితే విగ్రహారాధనతో గూడిన మన వివాహబంధనము ఎగిరి పోతుంది. అప్పుడు నీవు స్వాతంత్రురాలవగుతావు. కాబట్టి యిష్టమువచ్చినవానిని నీవు వివాహము చేసికోవచ్చును. అందుకనే మనమిద్దరం ఒక యింట్లో యుండడానికి వల్లకాదు.

రామమ్మ తలవంచుకొనెను. మరి మాట్లాడలేదు. విగ్రహం వలె నిలుచుంది. కాని కాస్త సేపటికల్లా, రామమ్మ యేడుస్తున్నదని నారాయణరావు గ్రహించాడు. హృదయం కొట్టుకులాడింది. రామమ్మను మంచముమీద కూర్చోబెట్టి కండు తుడు

స్తావనుకొన్నాడు. కాని ఈ పనిచేయడం తప్పేమో అని తోచింది. రాత్రి నిర్జనగృహంలో స్త్రీని మంచంమీద కూర్చుండబెట్టుకొనుట నీతివిరుద్ధ మనుకొన్నాడు. అందువలన యిట్లన్నాడు. “రామమ్మా! ఏడుస్తావెందుకు. నీ క్షేమంకొరకే నేనుచేసి ప్రియత్నం,, కాని రామమ్మ జవాబు చెప్పనూలేదు ఏడ్పు ఆగనూలేదు.

నారా:— రామమ్మ.

ఈ పిలుపులో భేదం వుంది. ఇది ఆదరణతో గూడుకొన్న పిలుపు. అందువలన రామమ్మ వెక్కి వెక్కి యేడ్వసాగింది. ఈ యేడ్పుజూచి విస్మితుడై నారాయణరావు యిటూ అనుకొన్నాడు. నామాటకు రామమ్మ కెంత దుఃఖము ఎంత క్లేశము! భావికాలానందమును గూర్చి యోచింపదు. మరిన్ని, నేను తనను ప్రేమించలేదు. ఇక ప్రేమించ బోను. ఈసంగతికూడ ఆమెకు తెలుసును, ఈ పెండ్డి బంధనము తెగిపోతే జీవితమును సుఖముగా గడుపవచ్చును. కాని యీ మాటకు ఎంతదుఃఖము? ఎంతదుఃఖము?

ఈ సమయంలో గడియారం నాలుగు కొట్టింది. అప్పుడు రామమ్మ ‘నేను వెళ్లుతాను’ అని అన్నది.

అప్పుడు నారాయణరావు, మంచముమీద నుండి లేచి ఆమె చేయిపట్టుకొని రామమ్మా! నీమనస్సులో సంగతి నాకు విప్పి చెప్పు. రాజమండ్రి వస్తావా రావా?

రామమ్మ:— (గద్గద స్వరమున) నాతల తిరుగుచున్నది.

నారా:—అయితే రేపురా? వస్తావా?

రామమ్మ:— వస్తాను.

నారా:— వస్తాను కాదు. తప్పకరా. (అని గట్టిగా చెప్పాడు. తలయూచి రామమ్మ వెళ్ళిపోయింది.

నారాయణరావుకు, మెలకువ వచ్చేటప్పటికి, గడియ పొద్దెక్కింది. మొట్ట మొదట రామమ్మ కన్నీరు కార్చుచు ప్రక్కన నిలుచుండినట్లు మనస్సునకు పొడ గట్టింది.

నారాయణరావు లేచి కూర్చుని, ప్రక్కకు తిరిగి, చూచేటప్పటికి కాళ్ళదిక్కున పచ్చరాళ్ళ తిరుగుడు పువ్వు కనుపడ్డది. వెంటనే దానినిదీసి ట్రంకులో దాచి పెట్టాడు.

ప్రతిరోజు, ఉదయం, ఉపాసన చేయడం నారాయణరావుకు ఆచారం. అత డెప్పుడు మరచి యెరుగడు. కాని ఇవాళ ఉపాసన చేయలేదు. బ్రహ్మ గీతములు పాడలేదు. ఆ విషయం అతని తలంపులో ఉన్నదో లేదో అనుమానం. కాని ఆదినం నారాయణరావు ఉద్భ్రాంత చిత్తుడయినాడు.

నారాయణరావు నిద్ర లేవగానే, పొన్నూరునుండి, వెల్లటూరుకు పోయే రోడ్డుమీద షికారు వెళ్ళాడు. ఏమేమో యోచిస్తూ నెమ్మదిగా నడచుచుండగా వారికమతగాడు, వుప్పరిరాముడు నురగులు గ్రక్కుచు, పరుగెత్తుకొని నారాయణరావు ప్రక్కకు వచ్చేటప్పటికి, ఉలికిపడి; ఏదియో ఒక అనుమానం వలన తత్తరపడుచు, ఏమిటి రాముడు ఏమిటి ? నాకోసమేనా ? రామమ్మకేమి...?

రాముడూ యేడుస్తూ పరుగెత్తుచుండ, ఓ రాముడు ? ఏమిటిరా ? చెప్పకుండా పరుగెత్తుతావేమి ?

రాముడు:— (ఇరవై గజాలు ముందుకేగి) బాబూ కొంప మునిగింది. మంత్రిగాడికోసం పరుగెత్తుచున్నాను. పాము కరచింది. అని పరుగెత్తుచు, అన్నాడు.

నారాయణరావు రామమ్మకే పాము కరిచిందనుకొని ఏమో అడగబోయే టప్పటికి, రాముడు చాలదూరం పోయినాడు. రామమ్మకా రామమ్మకా అని నారాయణరావు కేకలు వేశాడు. కాని ఆమాటలు రాముడికి వినబడలేదు. జవాబులేదు.

వెంటనే నారాయణరావు ఇంటి మొఖం పెట్టాడు. పది బారలు పొయ్యే టప్పటికి వడక వృద్ధి అయింది. పరుగెత్తాడు. ఇల్లుజేరి అటునిటు చూచాడు. కాని ఎట్టి గందరగోళం లేదు. మండువా ప్రక్క తల్లి పిల్లలకు అన్నం పెట్టుచున్నది. ఆ పిల్లలలో నాలుగేండ్ల యీడుగల కృష్ణుడు, మూతికి, చేతులకు, పొట్టకు పెరుగుఅన్నంపూసుకొని, మొలగజ్జెలుగలుగల్లుమన వంటయింట్లో జొరబడ్డాడు. వాడు మడి వస్తువులు ముట్టుకుంటాడని, ఆమె పరుగెత్తింది. మిగత యిద్దరు పిల్లలు చప్పట్లు గొట్టుచూ నవ్వుచు పారిపోబోయి మండువా స్తంభాలను బట్టుకొని "నాలుగు స్తంభాలాట" అని స్తంభాలను యెంగిలి పూస్తున్నాడు. ఆమె కృష్ణుని పట్టుకొని కండ్లు త్రిప్పుచు 'ఛడవా? ఎంగిలి మంగలమై పోతున్నావా!' అని బుగ్గలు పెలివేశే టప్పటికి బిక్క మొఖం పెట్టాడు. ఆమె పిల్లవాడిని, కౌగలించుకొని పకపకనవ్వింది. ఈ దృశ్యాన్ని చూచి, పడమటింటి వైపుకైనా చూడని నారాయణరావున కెదురుగా, సీతారామశాస్త్రి దర్భాసనంమీద గూర్చుని రామాయణం పారాయణం చేస్తూ ఉన్నాడు. దొడ్లోకి వెళ్లితే, పెద్ద వదినగారు తులసికోటచుట్టూ ముగ్గులు వేస్తున్నది. కాని రామమ్మ కనబడలేదు. అప్పుడు నారాయణరావు తనగదిలోకి పోయినాడు. ఒక నిమిషం కుర్చీమీద జారగిల పడ్డాడు.

వెంటనేలేచి దొడ్లో అరటిచెట్టు చాటునుండి, దొడ్డివాకిలి దగ్గరకు పోతున్నాడు. రామమ్మ, మహాలక్ష్మి బిందెలలో బట్టలు వేసికొని రేవుకుబోయి, బట్టలు వుతుక్కొని మంచినీళ్లు తేవడానికి వస్తున్నారు. వారిఎంక నారాయణరావు చూచేటప్పటికి రామమ్మ విచారంగా వున్నది. మహాలక్ష్మి నేత్రములు కౌతుక పూరితములైనవి. కాని వారు నారాయణ రావును చూడలేదు. అరటిచెట్టు దగ్గరకువచ్చి నారాయణరావును జూచింది. నాకంతా తెలుసునులే అని ఆమె కన్నులు హేళన చేస్తుండగా నారాయణరావు ఇట్లా అన్నాడు. ‘మహాలక్ష్మి? యెవరికే పాము గరిచింది?’
మ:— పాము గరిచింది? ఎవరికి? నాకు తెలియదు.

అంత నారాయణరావు, గొడ్లసావిట్లోకి వెళ్ళి విచారించగా కమతగాడు వుప్పరి రాముడి పెండ్లానికి పాము గరచిందని విన్నాడు. ఆమాట వినగానే నారాయణరావు రాముడింటికి వెళ్ళాడు. అక్కడ మొగవాళ్లు, ఆడవాళ్లు గుంపులుగుంపులుగా చేరిరి. వేపమండతో గొట్టుచు మాలపాపడు మంత్రం వేస్తున్నాడు. కాని ఆస్త్రీ బ్రతుకలేదు. రాముడు ప్రసిద్ధికెక్కిన యానాది మల్లాయను, తీసుకుని వచ్చాడు. వాడా వైపుకు గొప్ప మంత్రగాడు. కాని లాభమేమి? అప్పటికే పెండ్లాము గతించింది.

రాముడు పెండ్లాంమీదబడి యేడ్చాడు. అట్టే పడి దొర్లిగింతలు పెట్టాడు. తల బాదుకొన్నాడు. ఆదృశ్యాన్ని చూడలేక అయ్యో! అయ్యో! పాపము రామరామ అనుకుంటూ ఎక్కడవాళ్ళక్కడకు వెళ్లారు.

# ౪

నారాయణరావు కండ్లొత్తుకుంటూ యింటికివచ్చి మడత కుర్చీమీద సంకుకొని యిట్లనుకొన్నాడు. "రాముడి హృదయంలో ఎంత ప్రేమ వున్నది- వీడు శుద్ధయెద్దుమొద్దు. చదువురాదు. దున్నపోతులతో నాగలి దున్నుతాడు. భాస్కరరావు వచ్చి వీడిని చూస్తే బాగుండును. ఏమంటాడో! అతి ఇప్పుడు యింగు లేకుండా మంత్రాలు చదివి పౌరోహితుడు చేసే పెండ్లిలో ప్రేమ పుట్టనే పుట్టదు. పుట్టడానికి వీలులేదు. అది అసంభవం అని చెప్పుతాడు.

ఇంతలో పోస్టు జవానువచ్చి ఉత్తరమిచ్చే టప్పటికి దానిని విప్పి చదువు కున్నాడు. ఆవుత్తరంలో విషయం ఇది.

సత్యమేవ జయతే.

రాజమండ్రి,

ప్రియమైన సోదరుడా ! 1-6-10.

లోగడ నేను వ్రాసిన వుత్తరం నీకు అందే వుంటుంది. నేడొక సంతోషకరమగు వార్త విని వ్రాస్తున్నాను. క్రొత్తగా లండను నుండి ఒక మిషనరీ దిగాడు. ఆయనకు తెలుగు చెప్పితే నెలకు 45 లు యిస్తాడు. రోజుకు రెండు గంటలు మాత్రమే ట్యూషను. కాబట్టి నీవు త్వరగావచ్చి ఆట్యూషన్‌లో చేరితే మన పనికి చాల సహాయంగా వుంటుంది. ఒకవారందినాల్లో నీవు రావలెను. లేని యెడల ఆట్యూషను మించి పోవచ్చును శ్రీమతి రామమ్మను దీసికొనిరా. జవాబురాగానే నేను జనానా మిషన్ లేడితో మాట్లాడి రామమ్మ చదువు విషయంలో తగిన బందోబస్తు చేస్తాను.

మిస్ కమల నీవు కనబడడంలేదేమని నన్నడిగింది. పాపం ఆమె పెంచే పిల్లి చచ్చిపోయింది. పిల్లికూన పాలు త్రాగడం లేదు. ఈ సందర్భంలో ఆమెకు ఓదార్పు వుత్తరం వ్రాయడం మంచి దనుకుంటాను. నీవు వ్రాసిన సానెట్లను ఇంకా పంపినదీ తెలియ జేయ వలెను.

నేను "ఓరియంటల్ క్రైస్ "ను గ్రంధము నామెకిచ్చి నాను. అది చదివి చాలా సంతోషించింది. ఆమె కొత్తగా యూనిటేరియన్ బుక్స్, కొన్ని. నావల్సు తెప్పించింది. అందులో ఒక నావల్ వెరి బ్యూటిఫుల్ వెరీ ప్యాథటిక్కు అని చెప్పింది. ఆ నావల్ అధరెవరో తెలియునా? లండన్ యూనిటేరియన్ లేడీ.

మొన్న నేను వాండ్ల యింటికి పోయినప్పుడు సిల్కుహాండు కర్ చీఫ్ మీద పేరు కుట్టుచున్నది. అది బహుశః నీ పేరైయి వుండవచ్చు ననుకున్నాను. ఆమెకు ప్రేమ క్రమ క్రమంగా నీమీద దట్టమగు చున్నదని నా అభిప్రాయం.

సోదరి రామమ్మను దీనికొని వచ్చే సంబంధంలో నీవేమాత్రము వెనక ముందాడవద్దు. ఏదయిన కష్టము వచ్చే యెడల ఈ క్రింది సంగతి మాత్రం జ్ఞాపక ముంచుకో. ప్రతి మంచి కార్యానికి కష్టాలు తప్పవు. క్రీస్తు తన మతమును వ్యాపింప చేయడానికి ప్రాణాన్ని కూడా అర్పించలేదా! సర్వ మంగళ స్వరూపుడగు విధాత నీకు తోడ్పడును గాత.

ఇట్లు భవదీయ మిత్రుడు,
భాస్కరరావు.

నాయణరావు ఉత్తరమంతా చదువుకున్నాడు. కాని ప్రత్యుత్తరం వ్రాయలేదు. కన్నీళ్ళు రాల్చుచున్న రామమ్మ మోము మనస్సునకు తట్టిన కొద్ది "నమ్మకం లేదు. ఆమాటవినగానే ఎంత దుఃఖం? అట్లాంటిదానిని రాజమండ్రికి దీసికొని పోయి ఏమిచేసేది?" అని నారాయణరావు అనుకున్నాడు.

ఆదినం ప్రొద్దున కమతగాడి, రాముడి యేడ్పు చూచి నప్పటినుండి నారాయణరావు నమ్మకం కొంత తరిగింది. "రామమ్మ తనను ప్రేమించుచున్నది. కాబట్టి వివాహం విడగొట్టుకోరదామంటే ఆమె కెంత దుఃఖం? అని అనుకున్నాడు. అనుకోవడమే కాదు. నమ్మినాడు. అందువలన పూర్వానురాగం లేకపోతే ప్రేమ పుట్టదనేమాటమీద సంశయం కలిగింది. ఆదినం సాయంత్రం నారాయణరావు గదిలో కూర్చుండి ఉండగా అన్నకొడుకు రాముడువచ్చి ఆయనకొక ఉత్తరం యిచ్చి పారిపోయినాడు. ఆఉత్తరంమీద పేరులేదు. పైకాగితం చించి లోపల ఉత్తరందీశాడు ఆఉత్తరం యిట్లాఉన్నది;—

అగ్నిసాక్షిగ వివాహమాడిన మీ అర్ధాంగి హృదయేశుని దివ్యపాద పద్మముల సన్నిధికి వ్రాసుకొనేది ఏమనగా;—

మీరెక్కడకు రమ్మనమంటే అక్కడకువచ్చి కలుసుకుంటాను. కాని ఇవాళరాత్రికి మీదర్శనానికి రాలేను.

ఇట్లు,

పాదసేవకురాలు

రామమ్మ

ఈఉత్తరం చదువుకొని నారాయణరావు ఆశ్చర్యపడ్డాడు "రావడానికి సిద్ధమా! "వివాహాన్ని విడదీసికోవడానికి దుఃఖం లేదా?" అని మనస్సులో తర్కించుకున్నాడు. తర్వాత ఆఉత్తరం

చదువుకున్నాడు. పదిమాట్లు చదువుకున్నాడు. "సుఖంలేక
పోతే నన్ను ప్రేమించడం లేను. అయితే అర్ధాంగి పాదసేవకు
రాలు అనుమాటలకు అర్థమేమున్నది?" అనుకొని అవుత్తరం తిరిగి
చదువుకున్నాడు. తిరిగి యోచించాడు. ఇటు నాలుగైదు నిమిషా
లైన తర్వాత "ఈ రెండు మాటలకు విశేష అర్థంలేదు. ఇవి
మామూలు మాటలు," అని అనుకున్నాడు. కాని యీసిద్ధాం
తంలోనికి వచ్చేటప్పటికి వాని మనస్సు బహు చీకాకుపడ్డది
వ్యథపొందింది.

కాని అచికాకు అవ్యథ యెంతో సేపు ఒక గడియ లేదా రెండు
గడియలు తర్వాత యిట్లా అనుకున్నాడు. "నన్ను ప్రేమిస్తే నేమి?
ప్రేమించక పోతే నేమి' ఆవిషయంలో నాకు మాత్రమైనా
లాభంలేదు విచారం లేదు" అనుకొని కపుల మానసిక ప్రతి
మను హృదయమందు దదిమి పెట్టుకొని యిట్లనుకొన్నాడు. "ఇక
ఆలస్యంచేయడం కూడదు. ఇవాళే నే రామమ్మను చేసికొని రాజ
మండ్రికి వెళ్ళడం మంచిది. ఎవరికి తెలియకుండా రాత్రి ఒంటి
గంటకు బయలుదేరవచ్చును. కాని మార్గం ఇక్కడికి మూడు
మైళ్ళు వెల్లటూరు అక్కడ రోడెక్కితే హాయిగా తాడేపల్లి వెళ్ళ
వచ్చును. కాని అదోవ మంచిదికాదు. రోటు యెక్కేలోపల
నాయనగారువచ్చి రామమ్మను తీసికొనిపోవచ్చును. తగాదాలు.
అయితే కనగాల యిక్కడకు అయిదు మైళ్ళు. అక్కడబండి చేసు
కొని పొన్నూరుపోయి రైలెక్కవలెను కాని యిరవై అయి
దుమైళ్ళ దూరంబండిమీద ప్రయాణం కష్టంకాని అదే మంచిది.
అని యోచించుకుంటూ పడుకున్నాడు. కాని ఆదినం నిద్ర
యెరుగడు. భవిష్యత్కాల సంబంధమునందు పలువిధ పన్నా

గములు బన్నుచు, కల్పిత రాజ్యమందు తిరుగుచుండగా కోళ్ళ కూతలు పిట్టల పిక ఫిక నాదములు పాలు పితుకుచప్పుడు గోకంటి పోట్లు, చల్లచేయు ధ్వని మేలుకొలుపు పాటలు వేదగానము విని లేచి సూర్యోని ప్రభో చిత్తశాంతి నొసంగుము. ధైర్యమొసంగుము, బలమొసంగుము, తండ్రీ నీపాదసేవకుని యందు కరుణించుము అని ప్రార్థన చేశాడు. 'మానసరాముని ధ్యానించిమనుడీ', అను కీర్తనను ఏకతారామీద పాడాడు. తర్వాత టేబిలుముందు కూర్చుని ఇట్లా ఉత్తరం వ్రాశాడు. రామమ్మ నాకు అర్ధాంగి ఎట్లయినది? ఈమెను సోదరి యనియే పిలచెదను.

"సోదరీ!

ఇవాళ రాత్రి ఒంటిగంటకు ప్రయాణం. ఆవేళకు నీవు నాగదివాకిలి దగ్గరకు రా? వచ్చేటప్పుడు రెండోబట్ట తప్ప మరిఏమి తీసుకురావద్దు.

ఇట్లు,
నీ సోదరుడు.
నారాయణరావు"

ఈ ఉత్తరం రాముడిచేత రామమ్మకు బంపించాడు.

ఆరాత్రి నారాయణరావు ఒంటిగంటకు భార్యను దొంగిలించుకొని పారి పోయినాడు.

౫

వీరు మరునాడు మధ్యాహ్నం పండ్రెండు గంటలకు పాన్నూరుచేరి, భావనారాయణస్వామి దేవాలయాన్నానుకొని యున్న సత్రింలో దిగారు. ఎండ మండిపోవుచున్నది. వడ ఈచెవులోనుండి ఆచెవులోనికి యీడ్చి కొడుతున్నది. బండి దిగగానే వెచ్చం తేవడానికి నారాయణరావు బజారు వెళ్ళాడు. రామమ్మ స్వయం బ్రాహ్మణ్ణి బిందె అడిగి పుచ్చుకొని నీళ్లకు వెళ్ళింది.

పెద్దకాల్వకు నీళ్ళువచ్చి పది దినాలయినది. కాని ఇంకా చిన్నకాల్వలకు వదలలేదు. చిన్నకాల్వలకు నీరువస్తేనే, కాని భావనారాయణస్వామి కోనేటికి నీరురాదు. అందువలన ఇంకా ఆవూరికి నీటి యెద్దడి తప్పలేదు.

రామమ్మ బావిదగ్గరకు వచ్చింది. చేతిలో చేదలేదు. నీళ్ళు తోడుకోవడం యెట్లా? రెండు జాములు దాటింది. బావిదగ్గర యెవరు లేరు.

ఆబావిప్రక్కన చిన్న చెరువు. పదిరోజుల క్రిందట కురిసినవర్షమువలన ఆచెరువులో గోతులు నిండినవి. ఆనీళ్లు చూడగా ప్రాణం లేచివచ్చి రామమ్మ స్నానం చేయడానికి అందులో దిగింది.

ఇంతలో నెవరో చేదబుచ్చుకొని మంచినీళ్ళకు రాగా వారిని చూచి రామమ్మ బావిదగ్గరకు వెళ్ళి ఆమెనడిగి చేదబుచ్చుకొని అక్కడ మళ్ళీ స్నానం చేసి బిందెడు నీళ్ళు తోడుకొని సత్రానికివచ్చి నారాయణరావు తెచ్చినబియ్యం కడిగి పొయ్యిమీద పెట్టింది కాని గజగజ వణక సాగింది. రెండు నిముసాలయ్యేటప్పటికి చలిజ్వరమని నిశ్చయించుకొన్నది.

నారాయణరావు పోస్టాఫీసుకు వెళ్ళి మేము వస్తున్నాము. అని భాస్కరరావుకు టెల్లిగ్రాము ఇచ్చి వచ్చేటప్పటికి రామమ్మ జ్వరంచే గజగజ వణుకుచున్నది. చింతనిప్పులవలె కండ్లెర్రబడ్డవి. ఆమె వంటిమీద చెయ్యివేసి చూస్తే చెయ్యి మండిపోతున్నది. రామమ్మను పడుకోమని చెప్పాడు. కాని యెక్కడ పడుకుంటుంది? అది చవిటిమన్ను. సత్రంవీరి వెంబడి జంపకానాయైన లేదు. అప్పుడు నారాయణరావు సత్రం బ్రాహ్మడిని బ్రతిమాలియీతా

కుల చాపవచ్చి దానిమీద ఉత్తరీయం పరచి (పడుకో జంపకాన నుప్పటి కొనుక్కొనియిప్పుడే వస్తాను, అని అన్నాడు

రామమ్మ:— వద్దు ఇప్పుడెందుకు ముందు మీరన్నానికి లెండి; మీకు అన్నం బెట్టి. తర్వాత నేను పడుకుంటాను. లెండి బావిదగ్గర స్నానంజేసి రండి.

నారాయణరావు;— పిచ్చిదానవలె ఉన్నావే. నేను అన్నం తింటాను నీవు పడుకో ఇప్పుడు జంపకాన గుప్పటి తెస్తాను. జ్వరం కొంచెం తగ్గిన తర్వాత యేగిలి పడుదుగాని.

రామమ్మ:— (వణకుచు) నాకువచ్చిన రోగమేమున్నదండి కానే పటి కరెపోతుంది. మీకన్నము పెడతాలెండి ఇప్పటికి రెండుమాటయింది. మూడుమాట్లు బజారు వెళ్ళుతారం వడగాలి యీడ్చి కొడుతుం టే! బాగుంది ఇప్పటికేమీ మొఖం వాడిపోయింది.

నారాయణరావు:— నీవు దీనిమీద పడుకో ? నాట్లాడక, తర్వాత చెప్తాను.

రా:— కాదండీ ? రెండు గంటలైంది. మీరు ముందు అన్నం తినండి. అన్నం తింటేనేగాని నేను పడుకోను.

నారాయణరావు అన్నానికి లేవనేలేదు. ఇట్లు నాలుగయిదు నిముషాలైనతర్వాతరామమ్మగోడకుఓరగిలబడ్డదిఅప్పుడు నారాయణ రావు ఆమె చేయి బట్టుకొని పడుకోబెట్టినాడు. అప్పుడు రామమ్మ గజగజ వణకుచు మీరు యిప్పుడు బజారు వెళ్ళవద్దు. అన్నంతిని వెళ్ళండి చల్లారిపోయిన తర్వాత బాగుండదు. అన్నది.

రామమ్మకు జ్వరం యెక్కువయింది మూసిన కన్ను తెరవకుండా పడిపోయింది.

౬

మూడవరోజు తెల్లవారగా జామున, రామమ్మకు తెలివి వచ్చింది. కన్నులు తెరచి చూచేటప్పటికి ప్రక్కనే నానుకొని భర్త కూర్చున్నాడు.

నారాయణరావు:— ఎట్లా వున్నది.

రామమ్మ:— ఏమి చెప్పేది. కొంచెం బరువు దించి నట్లున్నది. మీరు అన్నం తిన్నారా, (అని యటు నిటు చూచే టప్పటికి అది సత్రం కాదు. పడుకున్నది. పట్టెమంచం! ఏమిటి? ఇప్పుడు నేనెక్కడ వున్నాను.

నారాయణరావు:— నీతో మళ్లీమాట్లాడుతాననిఅనుకోలేదుసుమా. మూడోదినము నీవుకన్ను తెరచి. ఇదిఒకగృహస్థునిగృహము

రామమ్మ:— మూడు రోజులైందా?

నారాయణరావు:— ఇవాళతో మూడోదినము. కండ్లు తెరుస్తా వని అనుకోలేదు.

రామమ్మ:— (నిమిష కాలము మౌనముగ నుండి నీరస స్వరముతోటి) మీకొక మాట చెపుతాను.

నారాయణరావు:— చెప్పు. ఏమిటి?

రామమ్మ:— నేను బ్రతుకను—

ఈ మాట వినగానే నారాయణరావు కన్నుల వెంట నీరు గ్రమ్ముకొని వెంటనే, ఛీ! అట్లాఅనక. నీకేంభయములేదు. ఒకటి రెండు దినాలలో జ్వరం పోతుంది.

రామమ్మ:— (పెదవులు వణకు చున్నవి. కళ్ళకు నీరు తెచ్చుకొని నారాయణ రావును జూచి) ఎందుకు నేను బ్రతకడం? ఈ పాపిష్టిఘటం! నాకు మందూవద్దు మాకూవద్దు.

నారా:— ఏం మాటలవి ? భయపడక! రెండు మూడు రోజులలో బాగా నయమవుతుందని డ్రస్సరుగారు చెప్పారు. ఏమీ భయంలేదు. పైన దేవు డున్నాడు.

రామమ:— ఎందుకు మీరు కష్టపడడం ? నన్ను బ్రతికించడం నేను బ్రతకడం? ఏమిలాభం నాకు మందు వద్దు. (ఆమె కలువ రేకులవంటి కనులనుండి రెండు నీటిబొట్లు క్రింద పడ్డవి)

నారా:— నేను నిన్ను ప్రేమించాను. కాబట్టి నాసర్వశక్తులు నీకు ధారపోయడం నావిధి.

కాని ఈ ప్రసంగమున రామమ్మ దుర్బల మస్తిష్కమునకు ఆయాసం కలిగింది. అందువలన ఆమె కన్నులు మూత పడెను. వెంటనే నిద్దుర బోయెను.

ఎనిమిది గంటలు కొట్టే టప్పటికి డ్రెస్సరుగారు వచ్చి రోగిని జూచి మందు మార్చి వెళ్లిపోయినాడు.

ఆదినము నాలుగు గంటలకే తిరిగి రామమ్మకు జ్వరం వచ్చింది. కాని ఆరు గంటలకల్లా పోయింది. అందువలన ఆనాడు రామమ్మ హాయిగ నిద్రపోయింది. నారాయణరావు మూడవరోజు సాయంత్రము కడుపునిండా అన్నము తిని గురుకొట్టి నిద్దరపోయినాడు.

ఎనిమిదిగంటలకల్లా డ్రస్సరువచ్చాడు. ఆయనను చూడగానే రామమ్మ సిగ్గుతో వొక ప్రక్కకు వొరిగి నిలుచున్నది. నిన్న పుదయంనుండి జ్వరంరావడం లేదని విని డ్రస్సరు సంతోషించాడు. 'నోపియర్', అని చెప్పుచూ డ్రస్సరు వెళ్లిపోయినాడు. డ్రస్సరు

వెళ్లగానే నారాయణరావు మందుయిచ్చి, పది గంటలకల్లా పథ్యం పెట్టితాను కూడా అన్నంతిన్నాడు. తాంబూలం వేసుకుంటూ కూర్చున్న, నారాయణరావును జూచి రామమ్మ యిట్లాఅన్నది.

రామమ్మ:— భోజనం తీసికొని వచ్చిన పిల్లవాడెవ్వడు?

నారా:— డాక్టరుగారి వంటవాడు.

రామమ్మ:— బ్రాహ్మడేనా?

నారా:— బ్రాహ్మడే, డాక్టరుగారు కూడ బ్రాహ్మడే అల్లూరిలో రామలింగం చైనుల గారిపేరు విన్నావుకాదూ

రామమ్మ:— ఆ విన్నాను

నారా:— ఆయన మా మేనత్తకు, బావకొడుకేగా ?

రామ:— అట్లాగా ఆచుట్టరికం నాకు తెలియదు.

నారా:— ఈయనపేరు, వేదాంతం రామలింగశాస్త్రి,

రామమ్మ:— ( ఈమాటవినగానే వొక నిమిషం తెల్లబోయి చూచి బ్రాహ్మణకత్తే లేను అని మనస్సులో అనుకొని ) అయ్యో మీరుచిక్కి శల్యమైనారేమండి. నేను మీ కష్టానికి కారణం, అనవసరంగా కష్టపెట్టాను.

నారా:— (చిరునవ్వునవ్వి,) నాకు జబ్బువస్తే నీవుకష్టపడవా ?

రామమ్మ:— అయ్యో ఇదేమి కోరికండి? బాగున్నది. జబ్బు రావలెనంటారేమి?

నారా:- (రామమ్మచేయి బట్టుకొని,) ఆదరస్వరముతో జబ్బు రావలెనని కోరలేదు. వస్తేనీవు చేస్తావా లేదా,

రామమ్మ:— (క్రిందజూచుచు) చేస్తానో చెయ్యనో.

నారా:— ఎందువల్ల ?

రామమ్మ:— నేను మీకు భార్యనైతేగా, నాకాభాగ్యం లభించడానికి.

నారా:— (ఆమెచెయ్యి గట్టిగా బట్టుకొని) నీవు నా ... భార్యవు.

ఈమాట రామమ్మ హృదయాన్ని యమృత సిక్తముగ నొనర్చింది. కనురెప్పపాటులో, ఆమె రూపు రేఖావిలాసాలన్ని మారిపోయినవి. అప్పుడామె మందస్మిత వదనారవిందమునుండి "ఎప్పటినుండి?" అనుమాట బయల్పడ్డది.

నారా:— నిన్ను ప్రేమించి నప్పటినుండి.

రామమ్మ ఈమాటవిని ఒక నిమిషం ఊరకుండి నూతనముగ నాశ్రయించిన సిగ్గుతోగూడిన మందస్మితముతో "మీరు బ్రహ్మసమాజంగదా అబద్ధాలు చెప్పరనుకుంటాను."

నారా:— అవును. నేనబద్ధమాడను. నిన్ను ప్రేమించాను.

రామమ్మ:— ' ఆదినం ప్రేమించనన్నారే

నారా:— (దానికి జబాబుచెప్పక,) నీవునన్ను ప్రేమించడంలేదుగా ?

రా:— ఎట్లాతెలియును ?

నారా:— వివాహాన్ని విడగొట్టికోడానికి యిష్టపడేగదా నీవు రాజమండ్రీకి వస్తానన్నావు.

రామమ్మ:— ఆ అవును. అయితేతర్వాత

రా:— తర్వాత ఏమున్నది! చిన్నపదిన నన్ను పంపించింది.

నా:— దానికోరిక నీవు మళ్లీ పెండ్లి చేసుకోవలెనని.

రా:— అవును. పరుణ్ణికూడా స్థిరపరచింది.

నా:— (తత్తరపాటుతో) ఎవరు?

రా:— యమధర్మరాజు.

ఈమాటకు నారాయణరావు పకపక నవ్వుచుండగా రామమ్మ యిట్లా అన్నది. "చిన్నపదిన నాకేమి చెప్పిందంటె చిన్నన్న నిన్నెత్తుకొని పారిపోతున్నట్లుగానె వాడిహృదయాన్ని మార్గంలో నీవు దొంగిలించి వెయ్యి. అట్లా చెయ్యడం చేతగాని యెడల.—

నా:— (మాటకడ్డమువచ్చి) చేత గాకపోతే అవివాహం నిర్ధారణచేసిరా? థేష్ బాగున్నది. నాహృదయాన్ని నీవు దోపిడి చెసుకున్న మాట సత్యమే కాని ఆ పెండ్లి ప్రయత్నంకూడా జరిగింది.

రా:— (చిరునవ్వుతోటి) ఆ పెండ్లి పేరిమతో గూడుకొన్న పెండ్లికాను. అందువలన ఆగిపోయింది. నేను మీహృదయాన్ని యెప్పడు దొంగిలించినానో చెప్పండీ చూతాము!

నా:— అవిషయంతర్వాత చెప్పతానులే.

రా:— ఎప్పుడో కాదు! ఇప్పుడే చెప్పండి

నా:— ఎప్పుడా నీవు నా కాళ్లవైపున పడుకొన్నప్పటి నుండి

దానితర్వాత ఈ ప్రయాణంలో ఇక్కడ. చాణక్యుని నీతి యేమంటె, ఘృతకుంభ సమమగు స్త్రీని, తప్త లోహ సమమగు పురుషుని ఒకచోట నుండనీయ వద్దన్నాడు. ఉంచితే చిక్కువస్తుందన్నాడు. అటునంటప్పుడు తరుణ వయస్కులమగు మనలనుగూర్చి చెప్పేదేమిటి?

రామమ్మ:— (మృదుస్వరమున) కమల నాకర్తను పెండ్లాడుతుంది! కమల గొప్ప సాధ్వీమణి. పదండీ రాజమహేంద్రవరం పోయి కమలను చూస్తాను.

నారాయణరావు:— మన ప్రయాణం రాజమండ్రికి కాదు మెడ్రాసుకు. రాజమండ్రి నిద్ర నికుపడవు.

రా:— (ఈమాటలు రామమ్మ చెవికెక్కలేదు) నిజంగా మిమ్మ ప్రేమించినా అయితే ఆమెను మిక్కి మొంగిలించింది.

నా:— కమలనన్ను ప్రేమించిందో లేదో ఆవిషయం ఆమెను దేవుడికి తెలియాలెను. కాని నాకు గాఢా తెలియదు.

రా:— ఎప్పుడూ చెప్పలేదా! మీరైనా అడుగలేదా!

నా:— నేనెప్పుడు ఆమెతో మాట్లాడలేదు. ఆమె యింటికి పోలేను. ఒకనాడు టవుక్ హాలులో మీటింగు జరిగింది. దానికి కొంచెం ఆలస్యంగా కమల వచ్చింది. కూర్చో

వ్వ                నాసీటు ఆమె

కిచ్చినాను. కమల థాంక్స్, అని నాకుర్చీమీద కూర్చున్నది. ఇంతేగాని అప్పుడుగూడ మాట్లాడలేదు.

రా:— మీరు ప్రేమిస్తున్నారని కమలకు తెలియునా?

నా:– ఎట్లా తెలుస్తుందీ? భాస్కరరావు చెప్పినాడేమో?

రా: – మీరామెను ప్రేమించినారుగా?

నా:– నిజంగా నేను ప్రేమించినట్లయితే నన్నింత శీఘ్రంగా నీవు సరిపరచుకోగలవా? ఇప్పుడేమి తేలుచున్నదంటె నేనామెను యదార్థంగా ప్రేమించలేదని. ఆ ప్రేమ హృదయమందు బుట్టినది కాదని. కమల విద్యాబుద్ధులు, ఆచారవ్యవహారం చూసి కొంతవరకు నేను మోహంలో బడ్డాను.

తర్వాత వారు నాలుగు దినాలు అడవిలో ఉన్నారు. మరునాటి ఉదయాన సాంగానెరు బండిమీద ప్రయాణం సిద్ధం చేసికొన్నారు. సాయంత్రం ఆరు గంటలప్పుడు భాస్కరరావు దగ్గరనుండి ఉత్తరము వచ్చింది. అవుత్తరము యిట్లా వున్నది.

బ్రహ్మశ్రీ పాహీ కేపలం.

ప్రియసోదరా,

సోదరి రామమ్మకు జబ్బుగా వున్నదని విని విచారపడ్డాను. ఈశ్వరానుగ్రహమువలన ఆమెకు త్వరలో ఆరోగ్యం కలుగుగాత.

నేడొక విచారకరమగు వార్త వినిపించవలసి వచ్చినందుకు దుఃఖించుచున్నాను. కమల ప్రేమించినదని నీవు నమ్మితివి. నేనుగూడ అట్లాగె నమ్మినాను. జోసఫ్‌రంగనాథమునకు, కమలకు వివాహము స్థిరమైనది. ఇంతేగాక రెండేళ్ళనుంచి వారికి ప్రాయింగు జరుగుచున్నదని విన్నాను. ఇందువలన మనవమ్మకం

భ్రాంతి యని తెలింది.

కమలకు బ్రహ్మసమాజాభిప్రాయములు కలవని, తలిదండ్రులు బ్రాహ్మణ కన్వర్టులుగాన, ఈమె బ్రహ్మ మతంలో కలుస్తుందని, ఆమెదగ్గర యూనిటేరియను బుక్కులు చూచి అనుకున్నాను. కాని అదివట్టి అబద్ధం. ఆమె స్ట్రాంచి క్రిష్టియను అని నాకింతవరకూ తెలియదు.

ఈ పిడుగువంటివార్త వినిపించక తప్పిందికాదు. అందువలన వ్రాసినాను. పరమేశ్వరుడు నీకు ధైర్య మొసంగుగాక.

మనమింకొక పొరబాటుకూడా పడ్డాము. హిందూమతం ప్రకారము జరిగిన పెండ్లి బ్రాహ్మ మతంలో చేరినా విడగొట్టుకొనుటకు వీలులేదని వొక రిద్దరు లాయర్లు చెప్పారు.

అక్కడనుండి నీవు రాజమండ్రికి వస్తావేమో! ప్రస్తుతం ఏమిలాభం లేదు. ఆ ట్యూషనుకూడా మించిపోయింది. ఏమి చేయడానికి తోచడంలేదు. నాయభిప్రాయం ఏమంటె, సోదరిని యింటికి బంపించి నీవు కలకత్తాకు వెళ్లి సాధనాశ్రమంలో అయిదారు నెలలు ఉండమని. నీవు బ్రాహ్మోపల్కారుగా నుండమని నాకోరిక. వీలైతే ఇంగ్లాండులో థియాలజీ చదువుకోవడానికి స్కాలరుషిప్పు సంపాదించవచ్చు. దానికి ప్రయత్నం చేస్తాము.

ఇట్లు విధేయ సోదరుడు,

భాస్కరరావు.

ఈ వుత్తరము రామమ్మ చదువుకొని పకపక నవ్వుచు, యిట్లన్నది. కమలది క్రైస్తవ మతమా? మీరు బ్రాహ్మణులా? మీరిద్దరు బ్రహ్మసమాజంలో చేరి— బహు బాగుందండీ మీ

యోచన! (అభిమానముతో) కమల మీద నాకు కోపంలేదు. పట్నం పోకుండా రేపు రాజమహేంద్రవరానికి వెళ్ళుదాము కమల పెండ్లి చూతాము.

నారాయణరావు:— (గంభీరముగ) వద్దు. ... ... ...

రాత్రి యెనిమిదిగంటలు. కొంచెం మేఘాలు పట్టినవి. అంధకార బంధురము. వీరి దొడ్లో పొగడచెట్టుమీద నున్న కోవిలకు మానవుల భాష తెలుసునను కుంటాను. లేకపోతే రామమ్మ అభిమానపూరిత వాక్యములు దానికెట్లు తెలియును? దానికి అంత సంతోషం ఎందుకు? చల్లని పయ్యెరగాలిలో శ్రుతి గలిపి మృదు మధుర స్వరమున పాడు దానిపాట కర్థమేమి?

నారాయణరావు భార్యను ఆలింగనముజేసి ముద్దుపెట్టుకుని 'రాజమండ్రికి వద్దు. ఇంటికిపోయి తండ్రిగారిని దర్శించి, వారి శెలవు గైకొని మద్రాసు వెళ్లుదాము.'' అని హర్షోత్ఫుల్లనయనములతో జూచుచు, బలికెను.

# ప్రకటనము.

(౧) కొండడి చరిత్ర చిత్రమైన కల్పితకథ వెల 0-4-0

(౨) భార్యనుదొంగిలించుట సాంఘికకథ. వెల 0-4-0

(3) దొంగయెవ్వడుదొరయెవ్వడు (చిత్రకథ)

(౪) అనాదరణ (చక్కని కథ) 0-3-0

(౫) కోడలు (ఇదియత్యుత్తమమగు కథ) 0-4-0

(౬) అనురాగములేనిరాగము. 0-3-0

(౭) వేణూబాయి (ఒకఘోర హత్య) 0-4-0

(౮) మొండెము. (భయంకరహత్య) 0-4-0

గ్రంథవిక్రేతలకు ప్రత్యేక ధరలు.

కావలసినవారు క్రింది విలాసమునకు వ్రాసికొన వలయును.

మేనేజరు

సరస్వతీనికేతనము

బందరు.

చందా సం॥ 6-0-0 | **శారద** | చందా అ॥సం॥ 3-0-0

సర్వాంగ సుందరమగు

# సచిత్ర మాసపత్రిక

ఆ[illegible]మైనది

అత్యద్భుతమైనది.

ఆంధ్రభాషలో మరియొకటి లేదు.

నిట్టి మాసపత్రిక

కథలు, కావ్యములు, నాటకములు,

సుప్రసిద్ధులు వ్రాయుచున్నారు.

వెంటనే చందాదారులు కండు.

చందా మనియార్డరు ద్వారా పంపిన

వి. పి. ఖర్చులుండవు.

మానేజరు

శారద కార్యాలయము.

మచిలీపట్టణము.

